# మించుపల్లి తెలుఁగు పోలుపు



## తెలుఁగు వెలుఁగు వ్యాఖ్య.

సూచిక—1. ఈగ్రంథమున మొదటిపుటనుండి 38 పుట 26 పద్యము వఱకును "మించుపల్లి" అనుశీర్షికగల కథాభాగము మాత్రమే 1951 మదరాసు విశ్వవిద్యాలయ ప్రథమశాస్త్రపరీక్ష (ద్వితీయభాగము Part II తెనుఁగు)కు పఠనీయ గ్రంథము.

సూచిక—2. ఈక్రింది సవరణలను తొలుతగ్రంథమున వెంటనే చేసి చదువ వలయును.

| పుట. | పద్యము. | పంక్తి. | అచ్చు. | సవరణ. |
|---|---|---|---|---|
| 4 | ... | 19 | యొంటట | యొంటట్ట |
| 5 | 19 | 2 | బారికాడు | బారికాఁడు |
| 6 | 24 | 7 | చెలంవుయుట్టి | చెలువముట్టి |
| 7 | 30 | 15 | ఒడలుచెడిగడనయొల్లను కడకుఁ దెచ్చు | ఒడలుచెడఁగ గడన యొల్లకడకుఁ దెచ్చు |
| 8 | 35 | 20 | మిగులంగాగుత్తించిన మోసకట్టు | మిగులుగాఁ గత్తిరించిన మోసకట్టు |
| 30 | 17 | 4 | నావదిన్నమాడ్కి | నావదినినమాడ్కి |
| 31 | 25 | 16 | అనుభవుండగు | అనుభవుఁడగు |
| ,, | 26 | 19 | నెక్కరిసి | నెక్కసిరి |

౧

ఈపాఠ్యభాగ మైదుభాగములు:—1 పల్లెవర్ణన. 2 సోమశర్మయుదంతము. 3 అప్పుమంత్రి వృత్తాంతము. 4 సోమశర్మ యప్పుమంత్రుల సమాగమము. 5 సోమశర్మ ఏనుఁగును నాశ్రయించి ఫలముఁగొందుట. 3 వ భాగమున 'కంబిలి' కథ పతివ్రతామాహాత్మ్యమునకు. 5 వ భాగమున కథ "కర్తవ్యో మహదాశ్రయః" అనుసూక్తికి లక్ష్యములను ప్రతిపాదించుచున్నవి. ఈకథాసన్నివేశము జరిగినకాలము క్రీ. శ. 1440 ప్రాంతము. కథాఘట్టము కళింగదేశము (నేటి యుత్తరవిశాఖజిల్లా)లోని సోంపేటయను నూరు. ఆప్రాంతమున వాడుకలోనున్న పలుకుబడి యిందచ్చటచ్చట ప్రయుక్తమైనది. శ్రీతో ప్రారంభము చేయుట మంగళాచరణము కొఱకని తెలియనగును.

గ్రంథాదిని 'శ్రీతో' ప్రారంభించి, గ్రంథాంతము 'శ్రీతో' ముగించుట తెనుఁగుకావ్యములలో ప్రాచీనసంప్రదాయము. గ్రంథాంతమున లేకున్నను గ్రంథాదిని 'శ్రీ'తో ప్రారంభింపనివి నేటినవ్యకవి కృతులే కానవచ్చుచున్నవి. కాని తక్కిన ప్రాచీనసంప్రదాయానుసారులగు నవీనమహాకవుల కృతులలో నీశ్రీకారప్రారంభము పాటింపబడుచున్నది. "శ్రీ" ఏకాక్షర పదము. సంస్కృతసమమునైనను, సంస్కృతపదరహితమైన 'అచ్చతెనుఁగు' కావ్యములలో కూచిమంచి తిమ్మకవి మొదలగువారు, మంగళాచరణమునకై 'శ్రీ' కారమును సంజ్ఞావాచకముగ నుపయోగించి యీసంప్రదాయము నిలిపియున్నారు. కావ్యాంతమున 'శ్రీ' నిలుపుటకును, కావ్యాంతమున మంగళాశాసనము కొఱకును, "మంగళమహాశ్రీ" వృత్తము ప్రయుక్తమైనది. ఈపద్ధతి తొలుత తెనుఁగుసాహిత్యములో ప్రవేశపెట్టినది నన్నెచోడ మహాకవి. ఆతని కుమారసంభవము ననుసరించి కొందఱు మాత్రము యీసంప్రదాయము పాటించిరి. ఈగ్రంథమున ప్రాచీనపద్ధతి పాటింపబడినది.

ఈశ్రీకారసంప్రదాయమునుగూర్చి విశేషముగ దెలుసుకొనదల

చినవారు సారచించిన "ఉదాహరణవాఙ్మయము" అనుగ్రంథముఁ జూడ నగును.

1. పుడమి-వి, పృథివీ. ప్ర. చేడియ-వి-చేటికా. ప్ర. ఇది ప్రకృతిలో తరుణవయస్కులకు దాసీజనమునకు పేరైనను వికృతిలో స్త్రీ పర్యాయపద ముగా ప్రయుక్తమైనది.

ఆణి-సుంద్రనిముత్యములు. ముత్తెముల పేరు-హారము. సంస్కృత ములో నొంటిపేటలహారమునకు ఏకసరము అని, మూఁడు పేటల హారమునకు "త్రిసరము" అని అయిదు పేటల హారమునకు పంచసరము (ఇదియే తెను గులో పన్నసరము బన్నసరము అయినది) అని వేర్వేరు పేళ్లతో నొప్పుచుం తెనుఁగులో దీనిని బట్టియే హారముల కంతకు సామాన్యముగా 'పేరు' అని వచ్చి నది. సరముశబ్దమునకు "సరి" తద్భవము - చూ. కంటసరి-కంఠసరము. లాంగ లీనది - దీనిని నేఁడు 'నాగావళి' అందురు.

పేరు - ప్రఖ్యాతి - ఇది 'పెర్' అను ద్రావిడధాతువునుండి పుట్టినది. పెర్, పేర్, పెరి, ప్రె - ఇవి యన్నియు నీ ధాతువునకు సంబంధించినవి. ఇవి 'పెద్ద' అను నర్థముకూడ నిచ్చుచున్నవి. సాధారణముగా పెద్దవారే చిన్న వారికి పేరుపెట్టుదురు గావున 'పేరు' అనునది సంస్కృతభాషలోని 'నామము' నకు పర్యాయమైనది. పేరు అనునది అధికము అనునర్థమున పేరోడ - పేరురము మున్నగుపదములలో కన్పట్టును. పేరురూపమే 'ప్రె' గా మారినది. *ప్రెగ్గడ = పేరు+కడ కడవఱకు ప్రఖ్యాతికెక్కినవాఁడు అనఁడే ప్రెగ్గడ. దీనిరూపాంతరము ప్రెగడ. ఇది 'మంత్రికి' పర్యాయపద ముగా పూర్వము వాడుకలో నుండెను. ఏలయనగా ప్రసిద్ధికెక్కిన ప్రెగ్గడలో మంత్రులును దండనాథులుగా నుండిరి. ధాతువు పేరు గావున 'ప్రెగ్గడ'

---

* ఈవ్యుత్పత్తి 10 వ సంఖ్యగలపద్యమున నీయఁబడినది. పుట 6-5 పంక్తి 'పేరుకడగల్గునప్పున ప్రెగడబుగత'

అని యుండుట యొక్క ప్రగ్గడ తప్పు. "క. దగ్గఱ కొండెము సెప్పిన, ప్రెగ్గడ పలుకులకు రాజు ప్రియుఁడై" అని భారతము

పేరుకొను - పేర్కొను-అనుశబ్దపల్లవక్రియయు నీధాతుసంబంధియే. జనతా-జనసమూహముయొక్క, అఖిలదుఃఖ = సమస్తదుఃఖములను రుజా = రోగములను, అపహారమై = పోగొట్టునదియై, మించుపల్లె చెన్నారును, అని అన్వయము.

2. ఈపద్యమున పల్లె యాజిముత్తెపు పేరుతో నెట్లు సరిపోల్చినది విచిత్రమైనది. వరుస ఇండ్లు ముత్యములు, కాలినడలు దారపుఁబోగులుగా నొకదానితో నొకటి పోలిక. పంటవలంతి = భూమి, లలంతి = హారము. ముత్తియము. వి. మౌక్తికము. ప్ర. ముత్తియము - ముత్తెము - ముత్యము రూపాంతరములు.

3. క్షీర......మాన= పాలతెలుపువంటి తెల్లఁదనము, సమశీతలతా= హెచ్చుతగ్గులులేని చల్లదనము, లఘుతా = తేలికదనము, అచ్ఛతా = కల్మషములేమి. ఈగుణములచే నొప్పునది. 'వారి' శబ్దము స్త్రీలింగముగాన, విశేషణములగు ఉపమాన, గుణోదార శబ్దములు స్త్రీలింగములే. చెఱువు- కెఱె అను కన్నడపదమునుండి వచ్చినది. ఇట్లే. కివి-చెవి-కిళిగల్-చిలుకలు మొదలైనవి. ఘటములు = కుండలు, మిన్నులు తఱిగినట్లు=ఇదియొక జాతీయము. స్వచ్ఛమగునీటిలో ఆకాశము ప్రతిబింబము స్పష్టముగా కన్పడును.

దేహధారకమునకు 'అన్నోదకములు' ముఖ్యములు. త్రాగెడు నీటిని గూర్చి మనపూర్వులు మిక్కిలి జాగరూకత వహించిరి. ఈక్రిందియాభాణకము పైగుణములను వ్యక్తీకరింపఁగలదు.

స్వచ్ఛం సజ్జనచిత్తవత్ లఘుతరం దీనార్థివత్ శీతలం
పుత్రాలింగనవత్ తథైవ మధురం తద్బాల్యసంజల్పవత్

ఏలాశీరలవంగ పాటలలసత్కర్పూర కస్తూరికా
జాతీచంపక కేతకైస్సురభిళం పానీయమానీయతామ్.

తా. "మంచివానిమనస్సువలె నిష్కలంకమైనదియుం దీనునికోరికవలె తేలికయైనదియుం కొమారుని యాలింగనమువలె చల్లనైనదియుం ఆకొమరుని వచ్చీరాని ముద్దుపలుకులవలె తీయనైనదియు; ఏలకులు, లవంగములు, పాటలి (కలిగొట్టుపూవు) విరజాజి సంపెగ మొదలగు పూలవలె సువాసనగల మంచినీటిని తెచ్చిపెట్టుము." పైపద్యములో రెండవపాదములో ఉదార - చెలువందుల - అనుచో నుపసర్గయతి; గుణ+ఉత్+అర - అని పదచ్ఛేదము.

సాధారణముగా మంచినీటిని నమృతరసముతో బోల్తురు.

4. తెలుపగు = తెల్లనై నునుపుగానున్న, పారిగోడలు = ప్రహరి గోడలు, ప్రహరిశబ్దభవము పారి. రాత్రివేళ ప్రహరిచుట్టు తిరుగుటయే "పారాయిచ్చుట."

"ప్రతిగ్రామమునకుఁ బ్రాచీనకాలమునఁ బెద్దప్రహరీగోడ యుండెడిది. ఆచిహ్నము లిపుడును తెలింగాణాప్రాంతమగు నైజామురాజ్యమునందును దత్తమండలములందును గాన్పించును. నైజామురాజ్యమున ప్రహరీ లిపుడును సింహద్వారము పాణిద్వారము కలిగి ద్వారముపై నుండెడు బురుజుపై 'నగరా' అనువాద్యవిశేష ముంచుటయు, రాత్రి గస్తీ వాండ్రాద్వారముల యందుండి గ్రామస్థులకు జాగ్రత్తఁదెలుపుచుండుటయుం నేఁటికిని గాననగును. ఉత్తరసర్కారులలోని ప్రహరీలు నాశనములైనవి!' (కీ. శే. శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు భారతి 12 సం. 3 వ సంచిక 439 - 443 పుటలు. "ఆంధ్రదేశముపై పిండారిల దండయాత్రలు")

ప్రహరితిరుగుట గ్రామనగరరక్షణకృత్యములలో నొకటి. చూ. భీమఖండము. "ప్రహరి చరింతురెప్పుడును భైరవు లర్ధనిశాగ మంబులన్" 1 ఆ.

**మిద్దె** = మేడ, మిద్దియ, మాడువు ఇవియన్నియు నొకదాని కొకటి రూపాంతరములు. పల్లెలయందు మిద్దె లింటి పైభాగమునకు కప్పునకు మధ్యనుండు ప్రదేశము. ఇది దారునిర్మితగృహమని తెనుగునిఘంటువులలో గలదు. ముద్రికాశబ్దభవము మిద్దియ, వాస్తుశాస్త్రమున స్వస్తికములు, భువనేశ్వరములు మొదలగు పేర్వేరురకముల యిండ్లు చెప్పబడినవి. ఆయిండ్లపై నాటకపు కట్టడమును తెలియజేయు నొకముద్రికను నిర్మించెడువారు. అది సాధారణముగా పైయంతస్థునందె పైకి స్పష్టముగా కానుపించుటచేత సామాన్యమైన కట్టడము అన్నింటికి తెనుగున మిద్దెలు, మేడలు అని పేరు కలిగినది. స్వస్తికముద్ర 卐 ఇట్లుండును.

ఇట్టి ముద్రికలుగల యుంగరములకు ముద్దుటుంగరములని పేరువచ్చినది. ఇవియే 'మద్దియలు మట్టియలు, మట్టెలు' అని రూపాంతరముల నందినవి. 'మట్టియలు' కొంతకాలమునకు స్త్రీలు కాలివ్రేళ్లను ధరించు నుంగరములకే పేరైనవి. 'వీరమద్దెలు' మొదలగుపదము లీముద్రికాశబ్దమునకు సంబంధించినవి.

రచ్చపట్టు - రథ్యాగృహము - పల్లెలలో రాజపథమునందుండు కొలువుసావడి.

తులసికోట - బిల్వము శివునికి ప్రీతియైనట్లు తులసి విష్ణునకు ప్రీతి. అయినను సద్వైతమతావలంబనులగు స్మార్తులయిండ్లయందు స్త్రీలు నిత్యము తులసిపూజ చేసెడువారు. దీనిని పెంచుటకు కోటవలె యిటుకతో, గచ్చుతో నొక యావరణము నిర్మింపజేసెడువారు. చెట్టుతోగూడ తమయిచ్చవచ్చిన కడ పూజసేయుటకు వీలగునట్లు ఇత్తడితో తులసికోటలు నిర్మింపజేసెడువారు.

"తులసి యింటనుంచువార్ని
తులసి పూజచేయువార్ని
తులసి యందు భక్తియుంచి మెలగువారిని

తులసి చూచి మ్రొక్కువార్కి
తులసి యనుభవించువార్కి
తెలిసి నీవు వారిదిక్కు తొంగిచూడకూ."

అను నీపాట స్త్రీలసారస్వతములో ప్రఖ్యాతమైనది. దీనినిబట్టి ఇంటి తులసికోట యునికిని గ్రహింపవచ్చును. తులసివిషహారమును, రోగనివారక మును నగుటచేత మనపూర్వులు దీని నిండ్లలో భద్రపఱచియుండెడివా రనియు గ్రహింపనగును.

తులసికోటయుఁ గోష్ఠములాలమందలున్.

తులసికోటయున్ + కోష్ఠములు + ఆలమందలున్ అని పదచ్ఛేదము.

కోష్ఠము - అనఁగా కోష్ఠాగారము, తినుబడిసంభారములు నిలువచేసెడి గది. కోష్ఠశబ్దభవము. కొట్టు. నేటికిని మనగృహములలో "కొట్టుగది." యను నంతర్భాగమున తినుబడిద్రవ్యము లుంచుదురు. దీనిని రాజగృహములలో సంరక్షించువాఁడు కోష్ఠపాలకుఁడు. హిందీభాషయందున్న "కొత్వాలు" అనుపద మీకోష్ఠపాలకశబ్దభవము. ఇది నేఁడు ప్రజారక్షణసేయు పోలీసు వారి కనువర్తించుచున్నది. 'కోష్ఠాగారము' అనుపదము కోష్ఠాగారవు - కొట్టారవు - కొట్టరువుగా మాఱినది. తిక్కన యింటిపేరు 'కొట్టరువు' వారని "కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు, దీనజనతానిదానంబు తిక్కశౌరి" అని దశకుమారచరిత్రమున కలదు. తిక్కనపూర్వులు కోష్ఠాగారపరిపాలకులు. అంతియెకాని కొట్టరువు అన్నది ప్రత్యేక గ్రామనామము కాదు. ఆలమందలు - ఆవులమందలు. కలిమినెలంత - లక్ష్మి.

**5.** గాదె = ధాన్యము నిలువచేసియుంచెడుగది. బోదె-మిద్దె, వేద నినాదము-వేదధ్వనులు, హోమవేదిక - అగ్నిహోత్ర మున్నస్థలము, పాదు-పాదులు, బూద - పాలకుండ, పాదుక = పావకోళ్లు.

6. పేరామని - నడివసంతకాలము, ఆమెతలు - విందులు. 'సీతారామనుకోరుట' అనునది జాతీయము. తోటలు మిక్కిలి ప్రకృతిరంజకముగ నున్నవని భావము.

7. వలరాచవారు - మన్మథుఁడు, ప్రాచీనకాలమున 'రాచవాఁడు' అనుపదము ప్రయుక్తముకాదు. ఏకవ్యక్తిని తెలుపు నీపదము బహువచనముగ రాచవారనియే ప్రయుక్తము. ఇట్లే దాయవారు (కుమారసంభవము 11-92) కోయిలరాచవారు (ఉత్తరహరివంశము.) "వలరాచరాచవారు." అని నైషధమున ప్రయోగము.

దీని ననుసరించి మనుచరిత్రమున వలరాచరాచఁ వారలికాక్షుకనువెట్ట గరగిన యలకనికరపుచోటు. (2-9) గలదు. కాని సర్వంకషవ్యాఖ్యానమున రాచవాఁడని యుండుటచే మనుచరిత్రముఁగూడ నట్లే ముద్రితమైనది. ఆనందముద్రణాలయమున నూతనమనుచరిత్రముద్రణమున పైప్రాచీన సంప్రదాయము ననుసరించి రాచవారను సాధుపాఠము గలదు.

ధనుశరములు - ఈసమాసము సరికాదని కృష్ణాపత్రికలో విమర్శకులు వ్రాసిరి. ఇది సరియైనదియే. సంస్కృతమున ధనుశబ్దము సకారాంత మొకటియు ఉకారాంత మొకటియు కలదు. రాఘవపాండవీయమున (2-56)లో అనుపమదివ్య విక్రమసమగ్రుఁడు...అను పద్యవ్యాఖ్యలో 'ధనువును' అను శబ్దమును సాధించుచు "సోయంధనురజనివక్రః" అను నైషధప్రయోగము నుదహరించి ముద్దరాజు రామన నీశబ్దయుదంతత్వమును సాధించియున్నాఁడు. నైషధములో మల్లినాథసూరి ఈశ్లోకవ్యాఖ్యానమున (5-102) లో "అయం శబ్దః ఉకారాన్తోప్యస్తి" అని యీశబ్దమును ప్రమాణీకరించినాడు.

కౌముదిలో జ్ఞానేంద్రభిక్షువు తత్త్వబోధినీవ్యాఖానములో ఉణాది 1 పాదము 7 సూత్రము.

భృ, మృ, శీ, తృ, చరి, త్సరి, తని, ధని, మి, మస్ జిభ్య ఉః - ఇది క్రమముగా.

భేరుః, మరుః, శయుంః. తరుః, చరుః, త్సరుః, తనుః, ధనుః, మయుంః, మద్గుః అను నుకారాంతశబ్దములను సాధించును.

ఇహ పూర్వత్రచ ధనురితి ఉకారాన్త స్సకారాన్తోవాబోధ్యం. ధను శరము లనునది తత్సమసమాసముగ బాలవ్యాకరణము తత్సమపరిచ్ఛేదము 80, 40, సూత్రములచే సమర్థింపవచ్చును. సాంతంబుల తుదిసకారమునకు లోపంబు ఉవర్ణకేతరవిభక్తి పరమగు 'వు' గాగమము బహుళముగా విహితము. కావున ధనువు+యొక్క— ధను+యొక్క— అని యేర్పడును. శరములతో సమ సింపగా ధను+శరములు ధనుశరములు అయినది. ఆంధ్ర సాహిత్య పరిషత్ప్ర కటితమగు చంపూరామాయణమున[1] (3-102) 'ధనువంశం బని విష్ణు వంశ నుగు' అని యుండగా పుటయడుగున 'ఇది ధనుర్వంశమున కపప్రయోగము' అని వ్రాయబడినది. ఇది సుప్రయోగమే యని సమర్థించి పైవిషయమును పాఠభేదవిమర్శనము అనుశీర్షికక్రింద ఆ. సా. ప. ప. లో బ్రహ్మశ్రీ, శ్రీయుత దువ్వూరి వేంకటరమణశాస్త్రులవారు విపులీకరించియున్నారు. కావున పైసమాసము సరియైనదని విమర్శకులు గ్రహింతురుగాక.!!

అల్లైన = వింటిత్రాడు.

మూనుము - సర్వస్వము - నిధానము.

మన్మథుని ధనువునకు చెఱకులు, శరములకు తలిరులు లేక చిగుళ్లు, వింటిత్రాటికి తుమ్మెదలు నిధానములైనట్లు చెఱకులు పొలములలోను, చిగుళ్లు మావిచెట్లయందును, తుమ్మెదలు పూఁదోఁటలలో నున్నవని క్రమాలంకార ముగా చెప్పబడినవి.

---

1. ఇది కార్వేటినగరసంస్థానమున కసవరాజుగారి కంకితముగా క్రీ. శ. 1700 ప్రాంతమున ఋగ్వేదికవి వేంకటాచలపతికవి రచితమైనది.సంస్కృత భోజచంపువున కనువాదము.

**8.** కరవీరములు నాగలింగములు నీశ్వరునికి ప్రీతికరములగు పుష్పములు. నాగలింగపుష్పమును గుఱించి వ. సు. రాయకవి చాటూక్తి యుదహరించిన నాస్వరూపము తెలియఁగలదు.

చ. పడగయుఁ బానవట్టమును స్ఫాటికలింగము నివ్వి మూఁడునున్
కడుకఠినంబు లేగలిని గాఁగలవో సుకుమారమూర్తియా
మృడు సెఱిఁగింపదగ్గ వలి సృష్టి యొనర్చెను తమ్మిచూలి పు
ష్పాకృతి భసితంపుఁగమ్మవలపుల్ గల యాపువునాగలింగమున్.

**9.** నింబవృక్షము - వేఁపచెట్టు. గ్రామదేవత - గ్రామమును రక్షించు దేవత. ఈగ్రామదేవతలు సాధారణముగ భర్తతో సహగమనముచేసిన స్త్రీలని చారిత్రక విమర్శకుల యభిప్రాయము. గ్రామదేవతశబ్దము బ్రౌనునిఘంటువు నందుఁదప్ప తక్కినవానిలో లేదు.

**10.** ప్రోలు + అమ్మ - ప్రోలమ్మ. ప్రోలు = ప్రోవు, ప్రోవులు = భాగ్యములు - ప్రోలమ్మ = భాగ్యదేవత. ప్రోలమ్మయే పోలమ్మయైనది. రావివేఁపగచ్చుదిమ్మ - రాచబాట సాధారణముగ పల్లెమధ్యనుండి పోవును. ఆబాటయందు పల్లెమధ్య ఒకవేపచెట్టు, ఒకరావిచెట్టు కలిసి నాటి ఆవి వృక్షములైన వెనుక దానియడుగున గచ్చుదిమ్మకట్టి, దానిపైననే యూరిపెద్దలు వ్యవహారములు తీర్చుచుందురు. దీనికంటియుండునది రచ్చరాయి. రచ్చ, రథ్యాశబ్దభవము. రథ్యా అనగా వీథియందుండెడు పెద్దబండరాయి. ఇది నలుగురైదుగురు కూర్చొనుట కుపయోగించును.

బుగత - భుక్తశబ్దభవము. ఒకభూభాగమున నేకభోగముగా ననుభవించువాఁడు. భుక్తశబ్దము, భోగికశబ్దముతో సంబంధించినది. ఇది చాల ప్రాచీనమైనపదము, భోగిక, బోగిమ, బోయ అనురూపాంతరములనందినది. 'శాలివాటభోగిక' 'మూటకూరభోగిక,' 'వంగ్రిబోయరాయ' మొదలగుపదములు ప్రాచీనశాసనముల గానవచ్చును. ఈబోయలు బ్రాహ్మణులనుమాట మఱువ

రాదు. (ఈశబ్దమునుగూర్చి శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారి 'ఆంధ్రదేశ చరిత్ర' పుట 470 చూడుడు.)

**11.** మిత్తి. ని. మృత్యు. ప్ర. సత్యము సత్తెము. వి. ప్ర. కొత్తడి. స్త్రీ సమూహమునకు, ముడి - కిరీటము వంటిది. చూ. కుమారసంభవము. "శృంగార రాజ్యలక్ష్మికి ముడిఁగలపినగతి హంసతిలకంబుఁ గబరిఁ బూన్చి" (9-13) నాగమాంబయను నొకవనిత సహగమనము చేసినప్పుడామె పాతివ్రత్యమునకు ప్రమాణముగా నామెకట్టినపసుపుచీరెలో కొంతభాగము కాలిపోకుండ నుండిపోయెను. ఇట్లు కట్టినబట్టగాని, తొడిగినరవికగాని, పెట్టిననగలుగాని, పూర్తిగా దగ్ధముగాక, ఏస్వల్పమాత్రమైన శేషించినచో నది సహగమనము చేసినస్త్రీ పాతివ్రత్యమునకు లక్షణముగా నెన్నినను.

**12.** పఱపుటిండ్లు - బల్లపఱపుగా నేటవాలుగా నుండుపంచలుగల యిండ్లు. మిరపగుడ్డె = వెరళ్లలో క్రొత్తగా నాటిన మిరియపుచేలు. చేనునకు బదులు గుడ్డె యని కళింగప్రాంతమున వాడుక. మిరియపుఁగాయలు మనకుఁ గ్రొత్తవి; మనపూర్వులు మొదట కారమునకు మిరియములనే యుపయోగించువారు. ఇప్పటికి బాలెంతల కిచ్చు మిరియపుటుండలకు కారమనియే పేరు. ప్రస్తుతము మన ముపయోగించుకాయలు, మిరియమునకు బదులుగా నుపయోగించుటచే వానికి మిరపకాయలని పేరువచ్చినది. ఇవి మొదలు బుడతకీచులు (పోర్చుగీసు) వారివలన దక్షిణ అమెరికాలోనున్న "చిల్లీ" అనుప్రదేశమునుండి మనదేశమునకు తీసికొనిరాబడినవి. ఇంగ్లీషుభాషలో మిరపకాయ "Chillis" అని పేరువచ్చుటకిదియే కారణము. ఇప్పటికిని దక్షిణదేశమున పితృకార్యములయందు మిరియములనే కారమున కుపయోగింతురు. మిరియపుంగాయ - మిరియపుఁగాయ మిర్యపుఁగాయ, మిరపకాయ అని యీపదము వ్యవహారములో పెక్కురూపము లందినది. ప్రతినిత్య ముపయోగపడు పదార్థము పేళ్ల కిట్టి రూపాంతరములు కలుగుట సహజమేకదా!

**12, 13** పద్యములలో కూరగాయలఁగూర్చిన విశేషములు గలవు. నేఁడు శాకాహారప్రాధాన్యమును మనము గుర్తించుచున్నసంగతి యనుభవైకవేద్యమే. ఈపద్యములనుగూర్చి పాడిపంటలు అనుపత్రికలో వ్రాసిన వివరణము నిందు పొందుపఱిచినాఁడను. దానిని చదువుఁడు. తెనుగువారి యాహారములో కూరగాయలు ప్రధానస్థాన మాక్రమించినవి. అందుచేతనే నానుడులలో కవులకావ్యములలో చాటూక్తులలో కూరలప్రస్తావన తఱచుగాఁ గాననగును.

కంపకులేనిమరద బచ్చలికేల. కొయ్యతోటకూరకు కొడవలికి సిగ్గులేదు. కోయక పెరుగదు బచ్చలి. ఇత్యాదులు పరశ్శతములు. కావ్యములనుండి యుదాహరణములు చూపుట కిచట చోటులేదు. “తోట(కూటి?)కూరకు చంద్రహాసముం దెత్తురే” (పినవీరన శాకుంతలము **4-48**)-‘కోయక పెరుగదు బచ్చలి, మేయక పాలీయ దావు మేదినిలోనన్, ఈయక కీర్తులు వచ్చునె వేయేలా ఘాణుగుపాటి వేంకటమంత్రీ!, సూరకవి వేంకటమంత్రి శతకము. ‘‘గాని శుభకందకంపకులేని దూలబచ్చలికి నేలకల్గునో పరమపురుష” సింహాద్రి నారసింహశతకము. గిర. దోస మూఁడురకములు. చేదిదోస, ములుదోస, నక్కదోస. తోఁటకూర ఆఱురకములు. ఎఱ్ఱ, నల్ల, ముండ్ల, పెరుగు, కొయ్య, చిలుక తోటకూర లనునవి.

**14.** పుణ్యవతులగుసతులు స్నానము చేయుటకు వెళ్లునపుడు పసుపుముద్దను దీసికొని వెళ్లుట విహితమైనకృత్యము. దేశకాలపరిస్థితులు మాఱుటచే నీయాచారము నేఁడంతరించుచున్నను ప్రాచీనకాలమున తప్పక నున్నట్లు ఖడ్గతిక్కన రణభూమినుండి పాఱివచ్చి స్నానమునకుఁబోయినపుడు నాఁడువారికివలె పసుపుముద్ద లుంచినకథ స్పష్టపఱచుచున్నది.

నూతిపళ్లెము = నూతిచుట్టును గచ్చుతో కట్టి యుండెడుభాగము. చివరపళ్లెమువలె నెత్తుగా అంచుకట్టియుండును గాన నాపేరువచ్చినది.

పరివలయము - పళ్లియరము - పళ్లెము అని శబ్దరూపావతారము. పళ్లెము తద్భవము. నిమ్మ, దబ్బ చెట్లకు నీ రత్యధికముగ కావలయును. గాన నూతిదగ్గఱ నీచెట్లను పెంచెదరు.

15. ఆనలు = చిప్పళ్లు, బాలకులు=మగపిల్లలు, ఆడపిల్లలు. బాలకి+లు= బాలకులు. బాలకుఁడు+లు = బాలకులు.

16. బూద=పాలకుండ, సొమ్ములు. పశువులు. (ఇది విశాఖ, గంజాము జిల్లాలలోని మాండలికము.) పులు-గడ్డి బొద్దులు=మోపులు, బక్కాలు - పశువులు - (ఇదియును మాండలికమే.)

17. దుక్కిపదను —. దుక్కి వర్షముకురియఁగనే నేల దున్నుటకు వీలుకలుగును.

18. బంగారుతీగెలు - శ్రేష్ఠములైన యొకధాన్యరకము. ఏలపాటలు- నాయకుని సంబోధనతో జానపదులు పాడుపాటలు.

19. కడవ - కటాహశబ్దభవమనుట సరికాదు. కడు+వా = కడవ. కడు = పెద్ద, వా = నోరు పెద్దనోరుగలపాత్రము - (దేశ్యము.)

20. ఉప్పుతోఁగూడ తొమ్మిది. ఉప్పుతోఁగూడ నిత్యజీవితమున కుప యోగించు తొమ్మిదివస్తువులు. "పటం ఘటం జలం కాష్ఠం తండులస్తైలమేవచ శాకమగ్నిసమాయుక్తం లవణం నవసంయుతమ్."

1. పటము = గుడ్డ. 2. ఘటము = కుండ. 3. జలము = నీరు. 4. కాష్ఠము = కట్టె. 5. తండులము = బియ్యము. 6. తైలము = నూనె. 7. శాకము = కూర. 8. అగ్ని = నిప్పు. 9. లవణము = ఉప్పు. ఉప్పు చివరది గావున మొదటికి వచ్చినది. వీనిలో మొదట పప్పులేదు. తరువాత యాహార పదార్థములలోనికి వచ్చినది కావుననే "ఉప్పుతో తొమ్మిది, పప్పుతో పది," అనుసామెత యేర్పడినది.

21. కైవంపు—చేతివంపు. నీరుకావి = తడిపినీడలో నారవేయుచు చాకలివానికి వేయని బట్టలు. మడుగులు అనగా సరస్సులని వేఱొక యర్థము.

పంచయజ్ఞములు. 1 సంధ్యావందనము, 2 పితృతర్పణము, 3 అగ్నిహోత్రము, 4 వైశ్వదేవము, 5 భూతబలి.

22. తెల్లకాటుక = నేడు మొగమునకు బూసికొను Face Powder వలె నుపయోగింపబడినది. నల్లకాటుక కండ్లకు, తెల్లకాటుక మొగమున కుపయోగింతురు.

23. మంచు జిలుంగువలువలు = మంచుతెరలవలె తెల్లని, సన్నని బట్టలు. పడుగు పేక=నేతకు ముందు సరిచేసిననూలు. గువ్వయంచు, పావురములు చిత్రించిన అంచుగల కోక, చీర. ప్రత్యేకముగా స్త్రీలు ధరించువస్త్రములకు కోకలని పేరు. చీర అనునది యొకప్పుడు మగవారుగూడ ధరించునది.

24. కొమిరె. కుమారీశబ్దభవము.

25. ఐదువ = అయిదువ. దీనికి శబ్దరత్నాకరమున అయిదువన్నెలగలది యని యుత్పత్తిగలదు. అది సరికాదు. ఇది సంస్కృతమున 'అవిధవా' శబ్దభవము.

26. స్పష్టము.

27. పాతర = భూమిలో ధాన్యము నిలువచేసి యుంచెడుచోటు డంపకపుబ్రాలు = దంపుడు బియ్యము. మజ్జిగలు ఇవి యైదువిధములు.

1. ఘోలము = నీరుచేర్చకుండ చేసినది.
2. మథితము = ఒకవంతు నీరుచేర్చినది.
3. ఉదశ్విత్తు = సగమువంతు నీరుచేర్చినది.
4. తక్రము = నాలుగువంతులు నీరుచేర్చినది.
5. ఛచ్ఛికా = పలుచనిది.

మథిత. మథిహ - మథియ, మజిహ - మజిగా = మజ్జిగ. అని రూపావతారము. చల్లదండాహాత్మైనది. అనగా కవ్వముతో చిలుకబడినది.' మజ్జిగలలో నిదియే శ్రేష్ఠము. కావుననే, 'మజ్జిగనుబోలు మందేది' మజ్జిగమున అనులోకోక్తి యేర్పడినది.

29. కషాయపానీయము = కాఫీ, తే నీరు మొదలగుపానీయములు.

30. మంచునీరు = మంచుకలిపిననీరు (Ice Water). కుడినీరు = మంచినీరు.

31. రంగునీరు = Aerated waters.

32. ఉడుపులు = బట్టలు.

33. అంగవస్త్రము=గావంచా. జమిలి నేత=రెండు పోగులనూలితో నేత జన్నిగట్టు = బ్రాహ్మణుడు.

34. మీసము = శ్మశ్రు శబ్దభవము.

36. మక్కా = అంపపుపొట్టు, బంకకలిపిచేయుపదార్థము. చెడావులు = చెప్పులు. సాకిరి = సాక్షి = అక్క-హృదయము.

37. కట్టెవాడు = కట్టెలమ్మువాడు. కరవాక-కోమటి. సముద్రతీరమునకు కొంచెమువద్దగా నున్నపల్లెలోని కోమటి.

38. ఇల్లరి = ఇంటిపన్ను, పుల్లరి = గడ్డిపన్ను.

39. ప్రోదిగల = బాగుగా పెరిగిన, కుదుళ్లు = నాలుగువైపులకట్టినవి.

42. దోరసి = చేలికత్తె.

44. గడి = ఊరిచివర, తొలికట్టడిచేతలు=ప్రాచీన ధర్మానుసారములగుపనులు.

45. అడిత్రావుడు = అధికతృష్ణ = వేసవి. కిత్తు = అగ్ని, నంటు నెడరు = అంటుకొనునాపద.

46. వలితెమ్మెరలు = చల్లనిగాలులు, తెలినుడులు = అచ్చతెనుగు మాటలు. తొలినుడులు = సంస్కృతముమాటలు.

47. బారాబలావతీలు=ఊరికినియతముగానుండు పన్నెండుగురు మనుష్యులు. వీరినే ఆయగాండ్రని యందురు. వీరు వంశక్రమానుగతముగా నాయా పనులను నిర్వహింతురు.

1. కరణము. 2. రెడ్డి. 3. నంబి(దేవాలయములోపూజారి). 4. పురోహితుఁడు. 5. చాకలి. 6. మంగలి. 7. కమ్మరి. 8. కుమ్మరి. 9. మాల. 10. మాదిగ. 11. తలారి. 12. బారిక.

ఆపల్లె - అడలడివో=అలజడులులేకుండ, బారాబలావతీపద్ధతియుండుటచే, మేలందెడును = మేలుపొందును. మడి = పొలము, గుడి = దేవాలయము, బడి = పాఠశాల, గడి = పొలిమేర వీనియన్నింటను ప్రాచీన పద్ధతియే పాటింపబడును అని భావము.

48. పల్లెలలో పుష్టిగలిగిన భోజనము, ప్రశాంతమగు జీవనము, మనస్సునకుఁ దృప్తిగలిగించువిహారము గలుగుటచే, ప్రజలు పూర్ణాయుర్భాగ్యము ననుభవింతురు. ఇహలోకమున సౌఖ్యము, పరలోకమున నానందము పల్లె జీవితము ప్రసాదించును.

ఇష్టపూర్తము = సంస్కృతమున దీనిరూపము ఇష్టాపూర్తమైనను తెనుఁగున నిష్టపూర్తమనురూపమే గలదు. క్రీ. శ. 1075 నాటి దీర్ఘాసి శాసనములో "మహిమనుధన యిష్టపూర్తఫలము లెల్లకాలంబును మెచ్చు తోడఁ దమకు నిచ్చుచుండు. శాసనపద్యమంజరి. పుట. 6.

ఇష్టము అనగా అగ్నిహోత్రాదికర్మములు. పూర్తములు అనగా చెఱువులు, నూతులు త్రవ్వించుట, దేవాలయము ప్రతిష్ఠాపనచేయుట తోటలు నిర్మించుట మొదలైనవి.

అగ్రహార మనఁగా రాజుచే పన్నుగ్రహింపబడక బ్రాహ్మణులు నివసించుపల్లె.

౨

2. అకరము = అగ్రహారము. కరము అనఁగా పన్ను. అది లేనిది.

ఆయవారము = ఇంటింటికివెళ్లి బియ్యముగాని ధాన్యముగాని యాచించుట.

పంచాంగము = తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము లను నైదంగ ములు కలది.

4. రోకలిమి=ధనసంపద, వాకలిమి = వాక్చాతుర్యము, చేకలిమి = హస్తలాఘవము. కలిమికీలు = ధనముసంపాదించు నేర్పు పైకొలదులు = తనకుమించినదారులు

5. ఆదరువు = ఆధారము, పంచభిక్ష - తెలిసియున్న యైదిండ్లకుఁ బోయి భిక్షఁదెచ్చుట.

6. లోఁగిలివారు = ఇంటిలోనున్నవారు - పేదఱికిమి - దారిద్ర్యము.

7. పైకిపటారము = లోలొటారము-పైకి పటహము మొదలగు పెద్ద వాద్యములధ్వనులు. లోపల - ఇంటిలో లొటారము (లోష్టారవము) కుండ పెంకులధ్వనులు. అనగా పైకి గొప్పగానుండి లోపల దరిద్రము ననుభవించుచు వేషము వేయుట.

9. నుడులఁజాయ = మాట ననుసరించుట - భార్య భర్తమాట ననుస రించి నడవవలయును.

10. ఇంతి = ఇంటనుండు స్త్రీ; మడఁది = అడగిమడఁగి యుండునది - ఉగ్మలి = భయపడుస్వభావముగలది.

11. పాయి = పాలుశబ్దముున కేకవచనము - ఇట్లే రేయి - రేలు - వేయి - వ్రేలు - వ్రాయి - వ్రాలు. ఇదియే 'బాయి' అయినది. గుస్త రించును-సమాధానపఱచును.

13. కులపాలికామణి - కులస్త్రీలలో శ్రేష్ఠురాలు.

14. కింక = కినుక.

16. నత్త నావ, = కుటుంబములో చిన్నపిల్లలు, కొంచెము పెద్ద పిల్లలు, అంతకంటె పెద్దపిల్ల లున్నప్పు డుపయోగించెడు జాతీయము. ఆయసి= ఆదాయము.

17. ఉమ్మలికను = దుఃఖమును, దుఃఖి = దుఃఖముగలవాఁడు.

18. ప్రేఁకటినిండుటాలు=పూర్ణగర్భిణియగుసతి. అట్టాకలు=బాధలు. ఆఁటడి = సంకటము. తెంపుతీవియ - ధైర్యలత.

19. కోనేటిచెంచనీట = కోనేటియందుగల హంసోదకము, పగలు సూర్యకాంతిచేత తప్తమై రాత్రి చంద్రకాంతిచే చల్లగా నుండునది.

20. అళికము = నుదురు, నెరవైన = ఒప్పుచున్న, ముత్తిరునీటిరేక= మూఁడువిభూతిరేఖలు, మూఁడు+తిరునీఱు+రేకలు = ముత్తిరునీటిరేకలు, విభూతికి తిరునీఱు దేశ్యపదము. సంబెళ = చెంబు - ఈరెండబ్రొద్దు = బ్రొద్దుటిపూట.

## 3

1. ఉత్తరతారము = ఉత్తరతీరము.

2. నింటగాఁగ = నిండుగాఁగ.

3. దేహారంబు = దేవగృహము - దేవతార్చనగృహము.

4. షట్కాలములు- అరుణోదయ, తపనోదయ, సంగవ, మధ్యాహ్న, సాయాహ్న, మర్ధరాత్రసమయకాలములు.

కంభంబై = స్తంభమురీతిని, పదునాఱుపూజలను = షోడశోపచారములను, ముత్+రస+అంగుఁడు = ఆనందరసమయమైన శరీరముగలవాఁడు, *కలుహారానీకము = కలువపూవులసమూహము.

* ఈపదవివరణమునుగూర్చి నా 'భాషాపరిశోధన-ప్రయోగవిశేషములు' అను గ్రంథము 14-20 పుటలు చూడుఁడు.

శివపంచబ్రహ్మమంత్రములు = సద్యోజాతాదిమంత్రములు. ఇవియైదు నీశ్వరుని యైదుముఖములనుండి పుట్టినవి.

5. శివపూజ = భోజనము - (శైవులపరిభాష)

7. అప్పు = నీరు.

9. సప్తసంతతి = సప్తసంతానములు.

తనయుండు, చెఱువును కావ్యంబు
నిధానము, గుడి, వనంబు, భూదేవస్థా
పనమును నీయేడును
జను శాస్త్రములందు సప్తసంతతులనంగన్.

ప్రబంధులు = ప్రబంధరచయితలు, షకటపములు = వేయినూట పదహారు రూపాయిలు. ఇందులో ష-6, క-1, ట-1, ప-1, అనుసంఖ్యలను నామాయక్షరములు తెలుపును. అవి చదివినపుడు చివరనుండి చదువవలెను, అప్పుడు 1116 అని యేర్పడును. (చూడుండు. ఆముక్తమాల్యద వే. వేంకటరాయశాస్త్రిగారిది. పీఠిక. 148 పుట.)

10. ఆస్మితాబుద్ధి - నే ననుభావము.

11. వడుగులు = ఉపనయనములు, వడుగులు = వటువులు, బ్రహ్మచారులు.

13. మంతురులు = మంత్రులు.

14. జనముద్దు - అందరికిముద్దుగొలుపు.

18. ఐపు = ఉనికి, సంగతి. (మాండలికము)

19. నీలిగాసెన = అద్దముపైకప్పు నల్లనిబట్ట.

21. తోరమగును - హెచ్చగును.

22. వెఱవేకి = విరహజ్వరము. ఎగ్గతము = ఏకాంతము.

23. తలంపువెల్లి = భావప్రవాహము. ప్రూపవయసు-అప్పుడే దాటిన లేతవయసు, వలపుసోఁకు = మన్మథభావము.

**26.** వెచ్చుచు = దుఃఖించుచు.

**27.** శకునపక్షిగాని = శకునములనుజూచి ఫలములను చెప్పువాని, న్వసర వేది = నాడీస్వరూపము దెలిసినవానిని; చేవ్రాలజెప్పువాని = చెయ్యిచూచి రేఖల ననుసరించి చెప్పువానిని, ప్రశ్నఁజెప్పువాని = ప్రస్తుతము గ్రహస్థితి యేవిధమున నున్నది యని యడుగగ బదులుచెప్పువానిని.

**28.** తొమ్మిదిగ్రహములు పండ్రెండురాసులలో తిరుగుచుండును. రాసు లలో మిథునరాశి యొకటి - ఈమెజాతకములో నాగ్రహము లోకమారు నారాశిలోనికి రాలేదు. మిథునము = దంపతులు. అవగ్రహము = అడ్డుపెట్టుట

**29.** ఈపద్యమందు నవలాశబ్దవ్యుత్పత్తి చెప్పఁబడినది.

నవలాపదమునకు 'ణవలయా' అని ప్రాకృతరూపము. ఇది 'నవలతా' సంస్కృతశబ్దభవము. క్రొత్తగా పెండ్లియైనవధువును తోడివారందఱుచేరి మోదుగురెమ్మలతో "నీమగనిపేరేమి? నీమగనిపేరేమి" అనిగట్టిగా స్పృశిం పుచు నడుగు నొకవిధమైన యాటకు 'నవలయా' అనిపేరు. అందు ముఖ్య మైన వారుస్త్రీలేకావున, 'నవలా' అనుపదము స్త్రీపర్యాయముగా ప్రయుక్త మైనది - నవలయా - తెనుగులో నవలా అయినది. అందుచేతనే నీదీర్ఘము నకు హ్రాస్వములేదని తెనుగువ్యాకరణములలో తెలుపఁబడినది.

**30.** తళ్లు = దాడులు. వెలిపొలము = ఊరిబయట పొలము.

**31.** మరులుగొనుట = మోహముగొనుట.

**32.** బాలకి = కన్యక - దణి - సేనాని - మొలకలకు = తప్పుదారులు.

**33.** ఎడలేమి = దగ్గఱలేకపోవుట, సురి-చూరకత్తి, ఊరులుపుంటిని = చీము రక్తము పైకి నుబుకుచున్నపుండుపై, యుప్పుపెట్టినట్లు = ఉప్పునంటించి నట్లు, ఎదను - హృదయమును, కలఁచుచు = సంక్షోభింపజేయుచు, నెఱియఁ జేసెను = బాధపెట్టును.

**34.** వలపుటపసడి = పరపురుషునిచే మోహితయైన దను నపవాదము.

**35.** గాలిశబురు = వినికిడివలన తెలిసిన వృత్తాంతము.

36. కన్నువొందదు = నిద్రపోవదు.

37. పేర్మిపోగులు = ప్రేమతంతువులు - పిరిగొన్నగట్టిగా పెనిచినట్టి, బ్రదుకనుకడిమిత్రాడు = జీవితమును రజ్జువును, పుటుకఁదలచె - త్రెంపఁదలఁచెను - అనగా జీవితేచ్ఛవదలి ప్రాణములు త్యజింప నిశ్చయించెను.

38. ఓరాత్రిని - ఒకానొకరాత్రిని. ఉద్దియ సేసె = ఉద్యమించెను. ప్రయత్నించెను.

39. తలపొలము = గ్రామసరిహద్దులో నుండుపొలము, కళ్లము = గడ్డి, ధాన్యము, పశువులుండుచోటు.

40. బ్రదుకువాడిమి = జీవితములోనికష్టములు.

41. వెండ్లు = గడ్డిచుట్టలు.

42. నెట్టికశీల = నైష్ఠికశీల = బ్రహ్మచారిణి

౪

2. అతిథులు = నియతముగా భోజనముకు వచ్చువారు. అభ్యాగతులు = భోజనసమయమునకు ముందు హఠాత్తుగా వచ్చువారు.

3. శివపూజ = శివునిపూజ.

4. చేపట్టుగావించి = భోజనముచేయుస్థలమంతయు చేతితో తుడిచి శుభ్రము చేసి, పత్రభోజనములు-ఆకులలో భోజనములు పాత్రభోజనము బంగారు వెండి కంచు పళ్లెరములలో పాత్రలలో భోజనములు. భరితభోజనము = తినఁదగిన పదార్థములన్నియు మాఱుడుగకుండ నొక్కమాఱుగా వడ్డించుకొను భోజనము, సజ్జలింగము = లింగధారులు ధరించులింగము. సాబంతి = సహపంక్తి.

5. దప్పళము=కొంచెముపప్పుతో, గలకాయకలుపుగలపులుసు. నిండుచంద్రుతోఁ దూఁగఁగలట్టి క్రొంబెరుగు = తెల్లని గడ్డకట్టినపెరుగు. భోజరాజు కాలమున కాళిదాసు "మాహిషంచశరచ్చంద్రచంద్రికాధవళం దధి." అని యిట్టి పెరుగును శిఫారసు చేసినాఁడు.

**6.** చౌలు=చవులు = రుచులు. కుప్పలుగూరలై=సమృద్ధములై, జలుం కుంజకుకారెడు = పైపొరలులేక నిగనిగలాడు, పప్పుప్రాలుం పప్పుబియ్యము, లప్పలు = ముద్దలు, చిలువాలు = కొంచెము వేడిగనుండి త్రాగుటకు వీలుగ నుండెడిపాలు, అప్పమంత్రి అన్నివిధముల తృప్తియగునట్లుగా భోజనము పెట్టును అని భావము.

**8.** అరవయామెత - సగము నోటిచింది. చూడుండు కళాపూర్ణో దయము.

"అజ్ఞాంకలఁబెట్టె దానరవ యామెత బాలికకై విటావళిన్."

**9.** ఇంగితజ్ఞుండు = మొగముచూడగనే మనసులోనిభావమును గుర్తించువాండు. మనీషి = బుద్ధిమంతుండు.

**10.** ఆర్త = దీనులను, త్రాణ=రక్షించుటయందు, పరాయణత్వము= ఆరితేరియుండుట. ధీర = ధైర్యముతోను, ఉదార = ఔదార్యముతోడను, కార్యక్రియా = కార్యములు కర్తృత్వము=నిర్వహించుట, శాంతసత్త్వము= ఉద్రేకము లేనిబలసంపద, దుర్గారక్షకత్వము = దుర్గమును సంరక్షించుట. ఇవి కలిగినదాన ,కుంజరుని = దానములుచేయువారిలో శ్రేష్ఠుని, ప్రాపు బొందుము = అండఁజేరుము. కర్తవ్యోమహదాశ్రయో = గొప్పవారి నాశ్రయించుటయే కర్తవ్యము.

**11.** వాకున = మాటలను, ఏకుండై = ఒకేభావముతో నుండు వాండై. దాని = దానముచేయువానిని, మతాకుము = మఁఅవకుము.

**14.** చదురుండు = చతురుండు.

**15.** ఎద్దడి = దరిద్రావస్థ. జతనము = యత్నము, తీవరము=తీవ్రము.

**16.** సంభారము = భోజనాదికమునకువలయు సమస్తవస్తువులు ఇది అప్పమంత్రి గుప్తదానమును విశదీకరించును.

**23.** విహస్తుండు = చెయ్యిలేనివాండు, చేతితో దానము చేయలేని వాండు.

24. బండలు = మూర్ఖులు, బసివి - పశువు. ఐదుకాళ్ల జంతువు = ఏనుఁగు, ఏను+కాల్ - ఏనుగాల్ - ఏనుఁగ అని రూపావతారము.

25. మస్తిష్కము = మెదడు, అనుభవుఁడు = అనుభవముగలవాఁడు, దశమి = తొంబదియేండ్లు దాఁటినవృద్ధు.

26. ఒక్కండు = ఒకఁడు రూపాంతరము.

28. గేస్తు = గృహస్థు, అర్థి = యాచించువాఁడు, వానరము నివారింపవీలులేని చంచలాత్మగలది. లేవా నరచేష్టలు. లేవు+ఆనరచేష్టలు=అట్టి మానవులు చేయుపనులు అనగా వానరములసహాయమున తమకార్యములు నెఱవేర్చుకొనుట.

౫

1. ముగురురాయలు = అశ్వపతి నరపతి గజపతి అనువారు. వీరిలో అశ్వపతులు తురుష్కులు. నరపతులు విజయనగరసామ్రాజ్యాధీశులు గజపతులు ఉత్కళదేశపురాజులు, వీరుముగ్వురను జయించుటచే కృష్ణరాయనికి "మూరురాయరగండ" అనుబిరుదము వచ్చినది. (మూరు-ముగ్వురు) దానిని= ఏనుఁగును.

2. పంచాంగములోని అంగము లిట దెలుపఁబడినది. ఉపరాగ కర్మకాండ = గ్రహణసమయములఁ జేయఁదగినకర్మలు.

3. ఏకరువువెట్టు = ఒకేసారిగా చదువును.

4. వేదురు = వెఱ్ఱి.

5. ఆవటము - ఏనుఁగులుండెడిస్థలము, గజస్నానము=ఏనుఁగు స్నానము, ఏనుఁగు ఎంతసేపుండి నీటిలో స్నానము చేసినను పైకిరాగానే దుమ్ముజల్లుకొనును. కాబట్టి స్నానముచేయుట వ్యర్థము. వ్యర్థముగా చేయుపనుల కీజాతీయ ముపయుక్తమగును.

6. ఎఱకలు = ఱెక్కలు, ఎసకమెసగ = విజృంభణమొప్పగా

7. హల్లోహలంబయి = అల్లకల్లోలమై.

8. పాఱఁడు = బ్రాహ్మణుఁడు.

9. రోజురోజు = దినదినమును.

14. తోకమడచి = గొప్పయంతయుకట్టిపెట్టి.

15. అడ్డమాఁకలేక = అడ్డము+ఆఁకలేక-అడ్డము=ఆజ్ఞ పెట్టువారు లేక.

16. ప్రాకృతజనుఁడు = అమాయికపుమనుష్యుఁడు.

26. పాలుపొంగినట్టుగ నైశ్వర్యము పెంపొందగా బ్రాహ్మణుఁడు సంపద లనుభవించెను. మంగళమహాశ్రీతో కావ్యాంతము సేయుట ప్రాచీన సంప్రదాయము.

ఈ గ్రంథమునగల వ్యాకరణచ్ఛందోవిశేషములను నెఱుఁగ గోరు వారు, నారచించిన 'ప్రయోగవిశేషములు - భాషాపరిశోధన' అను గ్రంథము చూడనగును.

# అనుబంధము

[''అనగననగ నొక్క యగ్రహారంబులో, బాపడొకండు లేమి బాపు కొరకు, నన్ను నాశ్రయించి యెనుంగెక్కిన యంత, సిరినిబొందె; దాని జెప్ప వాడ'' నని చెప్పిన పద్యకృతి. ఇది కథ ఏమయినా, వాఙ్మయ మేతరగతికి చెందినా, స్వయంపోషణ కీనాడు సమస్తజనులు తల్లడిల్లి పోతూన్నపుడు, 'మించుపల్లె' లోని ఆదర్శగృహం, కూరగాయల విషయమై మనము పూన వలసిన కార్యక్రమాన్ని చెవిజోరీగవలె ఘోషించగలదు.]

ఇది శ్రీ నిడుదవోలు వేంకట్రావు, ఎం. ఎ., మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రోపన్యాసకులు వ్రాసినది. ఈ కథాస్థలం ఉత్తరవిశాఖజిల్లా లాంగుల్యానదీప్రాంతం. అక్కడి అగ్రహారం. స్వయంపోషకంగా నిత్యకళ్యాణంగా నిరాడంబర జీవనంతో మెలగేది. సోంపేట చేరువనున్న 'కంచిలి' అనే గ్రామాని కాపేరు ఎట్లువచ్చినదో కూడ చిన్న ఉపాఖ్యానముగా చెప్పబడింది. వ్రాసినపద్యాలు మృదువుగా, తీరుగాకూడ నడిచాయి. 'పుట్టతేనియ పోలిక నిట్టలంపు దీయదనమున బాసలదీటు గనక, నాటుపలుకులలోపల నాడెమైన తెనుగుబాసయ మాకెల్ల తెలిపునిచు' అన్న విషయాన్ని ప్రతిధ్వనింప జేయడమే కాకుండా పల్లె ప్రాంతాలలో నింకను బ్రతికియున్న కొన్నికొన్ని తెనుగు పదాల వాడుకను కవితన ఈకృతిలో పునః ప్రచారం చేశాడు.

కాని, ఏగ్రంథమైనా ఒకస్థల నిర్దేశాన్ని చేసినపుడు, అక్కడి వర్ణనల నివ్వడము సహజమే, ఆవర్ణనలలో దేశకాలపాత్రల విషయాలు స్ఫుటముగా దెలియగలవు. అటువంటి నిరూపణను చేయలేనపుడు ఆగ్రంథరచనయే పేలవంగా ఉంటుందికదా! ప్రస్తుతం ఈమించుపల్లెలో అగ్రహారపు టిండ్లవాకిళ్ల నుదహరిస్తూ, అక్కడి కూరపాదులను ఎక్కువ ఆదర్శప్రాయంగా వర్ణించాడు. ఆ అగ్రహారంలో,

"పైపయిన దీర్చికట్టిన పఱుపు టిండ్ల
పెరటిలోఁ గ్రొత్తనాఁటిన మిరపచేను
కంద, బచ్చలి, నీటి వంగలును, చేమ
పొదలము దుంపకూర మట్లుండు మెండు
కాకరయు బీర పొట్ల యాఁగాకరయును
దొండ యాదొండ నేదొండ మెండుకొనఁగ
దోస మూఁడు రకంబులుఁ, తోఁటకూర
యాఱు రకములు నచ్చట నలరుచుండు
నూతి పళ్లెంబు చెంగటిగోతి దరిని
నిమ్మలును దబ్బపండ్లును నిండియుండు."

నీటిలో నైసర్గికముగా వన్యజాతి కూరలకు అనుకూలత నుండబట్టి, ఆగాకర, నేదొండ మొ॥వి కూడా ఉదహరించబడ్డాయి. అయిన ఇదొక ప్రాంతీయ స్వయంపోషక ప్రణాళిక కుదాహరణ కాగలదు. ఈనాడు అహార్నిశాదులు 'మనకు రక్షకాహారాలైన' "కూరపాదులను బెట్టండి,అని చేస్తున్న నినాదానికి పైవిషయము కనువిప్పు కాగలదు. ప్రతియిల్లుకూడ స్థానికముగా పెరిగే, దొరికే కూరజాతులతో స్వయంసమృద్ధిగా నుండేవి లేనపుడు ప్రతినిత్యము అవసరమయే అరటియాకునకు, కరివేపాకునకు, నిమ్మకాయకు, సజ్జకూరకు ఆమడ దూరానున్న పెద్దగ్రామపుసంతకు పోవలసి ఉంటుందికదా. ఇంతకు ఇంట బెరిగిన కూరవస్తువుకు ఏదీసాటిరాదు.

సంవత్సరము పొడవునా బచ్చలికూర దొరకుతుంది. దాని నింతకూ కోస్తునేవుండాలి. దాని ననుసరించే 'కోయక పెరుగదు బచ్చలి, మేయక పాలీయదావు మేదిని లోనన్' అన్నారు. అంతేకాదు పూర్వీకులు వైదిక కార్యాలలో వంటలనుకూడ వివరిస్తూ, సర్వకాలాలలోను. తేలికగా, చాలినంత సమృద్ధిగా (అంటే సమారాధనకు చాలినంత) దొరికే కూరలనే నిర్ణ

యించారు. వాటిలో బచ్చలి ఒకటికదా. అందుకనే 'బచ్చలి పదికూరలపెట్టు' అన్నారు. ప్రతియింట మామిడి, బచ్చలి, నిమ్మ, కరివేపాకు ఉన్నప్పుడు కూరల దరిద్రముండదని మాధవాచార్యులు తన 'కాలమాధవములో'......[''జంబీర శ్యామనింబశ్చ మాతశ్చోచ్చ సోదకీ తథా, గృహే యత్రవసంత్యత్ర శాక హైన్యంనవిద్యతే''అని] ఆనాడు వ్రాసిఉంచాడు. ఇంటి నీటివాడుకను దుర్వి నియోగపరచి మురుగుడుగా నుండబెట్టినపుడు ఇంటనున్న వారికి దోమలు, ఈగలబాధ హెచ్చయి రోగాలు రాగలవు. మురుగునీటిని ఇప్పటి పట్నాల లోవలనే కాల్వలద్వారా ఎక్కడకో దూరానికి తీసికొని పోవలసిన అగ త్యము గ్రామములో లేదు. ఉన్న అవకాశాలు కూడా తక్కువేమో. ఎక్కడి నీడిని అక్కడనే మురగకుండా సద్వినియోగపరచే కార్యక్రమము చాల మెచ్చుకోన తగ్గదిగదా. నూతికి దగ్గరగా నిమ్మ, దబ్బచెట్లునునాటి పెంచినపుడు వాటికి ప్రత్యేకముగా నీరుపోయ నక్కరలేదు. ఇంటివాడుక నీటిని నూతి పళ్లెమునుండి వాటికి మరలించిన చాలు. అంతేకాదు. ఆగ్రామములోని పెరళ్లు చిన్న చిన్న అరలమాదిరిగా ముచ్చటగా మూడుకుర్చీలు వేయటానికైనా చోటులేని మూడుచదరలచోటు కాకుండా, విశాలమైనవిగా ఉన్నాయి. ఇప్పటికి ఇవి వాస్తవమే, పెద్దపెరడు. పెరటిలో పెద్దబావి. బావికొక ఏతాము. ఏతాముతో నీరు తోడి పోయవలసిన ఆచారము ఉన్నప్పుడు అధ మము ఒక పాతిక యెకరమైనా ఉండాలి. పెరటిలో యేతాము ఉన్నట్లు 'మించుపల్లెలో'

''ఇంటి పెరటి వెనుక నేతాము నూతికి
ప్రక్క కాలినడనుబట్టి''

కవి వ్రాయనేవ్రాశాడు. అంతటి పెరడుండబట్టె ఒకయింటనే ఎన్నో కూరలను పెంచ వీలుండెను; కూరలకు 'మళ్లు'కూడ ఏర్పాటు.

దుంపకూరలలో కంద, చేమ, పెండలము, పెరళ్లు చిన్నవియైనా కంద పిలకను విధిగా పెంచే ఆచారము ఈనాటికి కన్పడుతుంది, 'పాలెలమ్మ

వాస్యకు వరి దుబ్బును కందపిలకను తెచ్చి పూజించి, గౌరిపూజచేసిన పిమ్మట, కందమువ్వవలె సంసారము దుబ్బుకట్టాలని కోరుతూ ఆకంద మొక్కను పెరటిలో నాటుకుంటారు. పెరిగి. కాలంఅయిపోగానే మొక్క చచ్చిపోయినా, దుంప భూమిలో నుంటుంది గనుక వర్షాలు తొలకరించగనే, అవి కూడ మొలచి కలకలలాడుతూ వాటంతట నవి పెరుగుతవి.

దోస తోట కూరలలో రకాలున్నట్లు కూడను్రించాడు ప్రస్తుతము మనంచూస్తున్నది దోసలో పందిరదోస, ములుదోస, నక్కదోస. ఇకను పెద్ద తోటకూర (తెలుపు, ఎరుపు రకాలు) మొక్కతోటకూర (లేక పెరుగు తోటకూర) ముళ్లతోట కూర, కొయ్యతోటకూర, చిలుకతోటకూర, దొగ్గలి మొదలైనవి తోటకూర జాతులు. వీటిలో ముండ్ల తోటకూర, చిలుక తోట కూర, ఇవి వన్యజాతులు. వీంట్లో ఆరింటిని మాత్రమే పేర్కొనడములో ఒక విశేషము ఊహించవచ్చును. తోటకూర చాల ప్రధానమైన ఆకుకూర అని ఆనాటికే ప్రఖ్యాతిచెందిఉండాలి. అంతేకాదు:—

పెరళ్లలో వేసుకొనదగు తోటకూర మొక్కలలో కొన్నిరకాలనే కాకుండా, వాటినే దఫదఫాలుగా కూడా చల్లడము అవసరము. లేకపోతే ప్రతిదినము ఇంటివాడుకకు స్వచ్ఛమైన సజ్జకి ఆకు, కాడ, ఏలా దొరక గలదు. మాటకు కొయ్య తోటకూరను ఆకుల చిన్న రెబ్బలను చిదిమి చాల కాలము వాడుకుంటూ ఉండవచ్చును. మొక్కలు ముదరవు చావవు. ఇకను లేతదనములో ఊడదీసి వండకపోతే పెరుగు తోటకూర పెద్దతోటకూర మొక్కల కాడలు, ఆకులు పీచెక్కి రుచిదప్పి వంటకు వీలులేకుండా ఉంటాయి. ఒకకుటుంబానికి **2, 3** పెరుగు తోటకూర మొక్కలు ఒకనాటికి చాలు దీనిని బట్టి మొక్కలు ముదిరిపోకుండా నిత్యపు వాడుకకు వీలయి నట్లు దఫదఫాలలో చల్లాలికదా. అయినా ఈపనికి కాలమానము, ఋతు ధర్మము కొంతవరకు అడ్డువస్తుంది. కొన్ని కొన్ని మాసాలలో పురుగులబాధ విస్తారముగా నుంటుంది. వాటిని తట్టుకొని రావడము కష్టము. ఈసూత్రాన్ని

అగ్రహారీకులు విధిగా గుర్తించి ఉండకపోతే తోటకూరలలో రకాల ప్రమేయమే వచ్చివుండదు.

మిగిలిన ప్రాంతాలలో తరచు దొరకని కొత్తకూరల ప్రమేయము ఇందులో సూచించడము ఒక విశేషము. ఆగాకర, ఆదొండ, నేదొండ ఈమూడును కూడ కొత్తవి. ఇవి **40-50** అంగుళాల వర్షపాతంగల కొండ ప్రాంతాలలో తొలకరితో మొలచి వర్షాకాలముతో ముగిసి, మరల వచ్చే యేడున తొలకరించే కొండజాతికూరలు. ఇవి విశాఖజిల్లాలోను, గోదావరి మన్య ప్రాంతములోనూ దొరకగలవు. నడివర్షాకాలములో మిగిలినరకాల కాయగూరలు విరివిగా దొరకనప్పుడు, చేదులేని ఆగాకర ఎంతో విలువగా నుంటుంది. ఆగాకర చిన్న ఉమ్మెత్తకాయవలె ఉండి చుట్టు ముళ్లమాదిరి గుబురులుంటాయి. తొక్కదళసరి. లోన గింజలు జాస్తి. వీటిని వేయించుకొనిగాని, పులుసు బెల్లము పెట్టుకొనిగాని తినే ఆచారము. ఇదే విధముగా నేదొండ. సాధారణముగా సాగులోనున్న పందిరిదొండమాదిరి కాయలుండ గలవు; కాని, పైన అప్పుడప్పుడు తెల్లని చారలు కనబడవచ్చును. లోపలి గుండ్రని గింజలు బెండగింజల మాదిరి ఉంటవి. ముదిరితే గింజల పెంకుగట్టును. లేతవైనపుడు గింజలతో సహితము తినవచ్చును. ముఖ్యముగా వేపుడు కూరగానే ప్రచారములోనుండె. కూరకొక తియ్యనిరుచి. లేతకాయలో గుజ్జు రెక్కువ. దొండకాయమాదిరిగానే ఇంచుమించు సంవత్సరము పొడవునా దీనికాయలు దొరకగలవు. అయినా ఇదికూడా ఆగాకరమాదిరి వర్షాకాలములో కొండలలో విపరీతముగాకాసి, వర్షాలుపోగానే తగ్గిపోతుంది. ఆదొండకూడ ఇటువంటిదే. ఆదొండను ఆకుదొండ అనికూడా పిలుస్తారు. దీనితీగమీద చిన్న ముళ్లుంటాయి. కాయలు నేరడి పిందెలవలె ఉంటాయి. లోని గుజురుకి చేదు కారముకలిసిన రుచి. పరుగులుగా తినడముకూడ కలదు. ఇదికూడ ఒక వన్యజాతిదే.

ఈకూరలు యిండ్ల పెరళ్లలో ఎక్కువగా పెంచబడకపోయినా వాతావరణము అనుకూలించినపుడు పెంచవగినవి. చేరువనున్న కొండలలో పుట్టి పెరిగి అప్రయత్నముగా చేతికందిన సద్యోఫలితాన్ని వినియోగించేటట్లు శ్రావణ, భాద్రపదాలలో విరివిగా అంగళ్లలోనికి తెచ్చి అమ్మగలరు. ఈ కూర మొక్కలు ఇంకను అభివృద్ధిలేక దిగువ మెట్టులోనే ఉన్నాయి. ఇప్పుడు మనముతింటూన్న మంచిజాతిధాన్యాలు పండ్లు, కాయలు అన్నీకూడా ఒక ప్పుడు మన్యస్థితిలో నుండివచ్చినవే. వాటివాటి ఉపయోగాలను దెలుసుకొని మానవుడు తనబుద్ధి నుపయోగించి శాస్త్రసహాయముతో అజాతులనుంచి ఎన్నికగల ఉపజాతులను తయారుజేశాడుగదా! అటువంటితయారు చేతకు మన్యపుమొక్కజాతులు మనయింటి ఆవరణలలో పెంపునకువచ్చినపుడే ఫలించ గలవు. వెనుక నడివర్షాలధాటికినోర్చి మనకందుబడులోనుండే కూరలు గనుక వీటిపై పరిశోధన ప్రచారము అవసరము. సామర్లకోట గవర్నమెంటుఫార ములో ఆగాకర, నేతిదొండ పాదులను విశాఖజిల్లానుంచి తెప్పించి కొంత పని చేశారు. అగోదావరి డెల్టా ప్రాంతములో ఆగాకరవచ్చినట్లు నేదొండ రాలేదు. అయినా ఇటువంటి ఉపయోగకరమైన స్థానికశాఖ జాతులపై ఎక్కువ పరిశోధన తోడిప్రచారము రాగలిగినపుడు ఫలితము రెండింతలు కాగలదు. ఇంటికికావలసిన కూరలు పెంపున మనమిట్టి అదర్శాన్ని గుర్తించ డములో ముఖ్యముగా ఇప్పటి అవస్థనుబట్టి ఎంతైనా అవసరమువది. ఏ ఆహార సమస్యకయినా రక్షకాహారాల ప్రాధాన్యతను మరువ వీలులేదుకదా!

ఈవిజ్ఞానాన్ని వాఙ్మయములో హత్తించి వ్రాసిన శ్రీవెంకటరావు గారు ఎంతో ప్రశంస నీయులు.

గు. స. నా.

# మించుపల్లి - తెనుఁగు పొలుపు

రచయిత:— పితృపాదుల బహుళ ప్రాచీన తాళీదళసంపుట ప్రకర
భాండాగారమున పుట్టి పెరిగిన ఆంధ్రభాషావేత్త.

శ్రీ నిడుదవోలు వేంకటరావు. ఎం. ఏ,

సాహిత్యోద్యానములో స్వైరవిహార మొనర్చునపు డందు సరస దోహదమున పొలుపుగూర్చుచు దిక్కులనెల్ల వ్యాపించుచు మనస్సు నరికట్టు నొకా నొక లతాంతము రసప్రలుబ్ధుల నాకర్షించుచుండును. అది సౌరభము చేతనేగాక, వర్ణనాతీతమైన ఆకారవిశేషమునగూడ నద్దాని కొక శోభగూర్చును. విద్యాకళోపాసకుల కారాధ్యమగును. అట్లే సత్కవికృత కావ్యములలో గూడ సకృత్తుగా సముద్రమథనమున పాలకడలితో నుద్భవించిన సుధా కలశమువలె నొకానొకటి కవిజనోపాస్యమై తనరారును.

నేఁడట్టి మహాకావ్య మొకటి అజాతమై, సంగీతవాణికి శిరోభూషణమై. తెనుఁగు పొలుపు తెలుపునట్టిది, తెనుగుతల్లి ప్రసాదించినది. అందలి యితి వృత్తము పఠితలను పులకింపజేయును. అట్టిది యెక్కడనున్నదో వెదకి కను గొని యందావాసించుటకుఁ బ్రోత్సహించును. పాశ్చాత్య నాగరక ప్రవాహ దుష్టమై భ్రష్టమై, బ్రహ్మవిద్యాజిగీషకు వేరుపురైవ, భారతీయులను కేవల కుక్షింభరులను నాస్తికులనుగా నొనర్చి పాడుచేసిన కార్యవిధానమును సుష్ఠు పఱచి, భారత సాంప్రదాయమును ప్రతిష్ఠించుట కొకయేడు గడవవలె నీ కావ్య మాచరించును.

— పుట సంఖ్యనుబట్టి చిన్న కావ్యమైనను, సద్భావ ప్రబోధమున మహా కావ్యమనఁదగియున్నది. ఇది సకల సుగుణ సంపెంగ యనవచ్చును. దీని రచ

యిత మృదుమధుర పదసంభృతమైన యొక సమాధియందు నిమగ్నుఁడై దీనిని రచియించియుండును. కాకున్న నిట్టి కృతి రచించుట సుకరముగాదు. ఈ మహాకవి తెనుఁగునాఁటఁబుట్టి, తెనుఁగుపదజాలమున బెరుగుచు, తెనుఁగు నుడికార భావమందుపాసించు, తెనుఁగుతల్లి ముద్దుబిడ్డఁడు. ఈగ్రంథమామూలమును రసగుళికవలె తనరారుచున్నది ; కవి దీర్ఘాయుష్మంతుఁడై, తెనుఁగు నకు వన్నెఁబెట్టుగాక !

ఆ తెనుఁగు పొలుపును పాఠకులకు రుచిచూపుటకై కొన్నిపద్దెము లిట నుదాహరించుచున్నాము. కాని దీని రుచి యావద్గ్రంథమును చదువుటకు ప్రోత్సహించును.

తెనుఁగు తల్లి

ఉ. తీరును తీయముం గలుగు తేట తెనుంగను పాలువోసినన్
కూరిన కూర్మిఁ గన్న కొడుకుం బలె పెంచిన తెన్గుతల్లినిన్
గారవ మారఁగా నెడఁద గద్దియ కొల్వున మిన్కుఁబూల కై
వార మొనర్చి కైతకద లారతి నిచ్చెద నిండు వేడుకన్. 1

ఉ. కానఁగ రానిపేర్మిఁ దన కమ్మనిపాలను రంగరించి పూఁ
దేనియ యుగ్గుఁబట్టి తమిదీరఁగ జాజుల తొట్లఁబెట్టి జో
జో నను గన్న తండ్రియని జోడగుకోయిల పాటపాడుచున్
తానయి పెంచు నా తెనుఁగుతల్లినిఁ గొల్చెద నెల్ల వేళలన్. 2

ఉ. కల్ల నిజంబుగాఁగఁ గనుకట్టుచు, తొమ్మిది చిల్లి బొందిలో
కల్లడిగాఁగ నించి తమకం బనునీటిని, మేని చేనిలో
పొల్లలడంచి, పెన్నుసురుప్రోవులనూర్చుచు,మారురూపులై
చెల్లని నాణెముల్ తిరుగఁ జెల్లఁగఁ జేసిరి తెల్గుకైసరుల్. 14

### తెనుఁగు కబ్బము

సీ. నిండువెన్నెల తెలినిగ్గంత యొక్కచో
కరువునఁ బోసెడు గట్టితనము
పాలమున్నీటపైఁ బడునలలను దెచ్చి
గండరు వోసరించు నిండుదనము
పలువన్నెరూపు రేకల నుట్టిపడునట్లు
చిత్తరువులు వ్రాయుచేవఁదనము
విన్నువాఁకఁ జెలఁగు పెన్నురువంతనుం
నొక్కరూపునఁ జేర్చు నొఱపుఁదనము
చూచినదియెల్ల నొకక్రొత్తసొగసుఁదోప
చూడనిది యట్లు చూపెడు సూటిదనము
తెనుఁగుమాటల నిమిడించు తెఱవుగనిన
కైసరుల కబ్బములు తొల్లి వాసిఁ గాంచె.

### తెనుఁగు బాస.

సీ. తీరుతీయంబులై తేటతెల్లంబులై చెలువాఱునట్టి పల్కులమఱుంగు
ఆణిముత్తెంబులై యపరంజిమువ్వలై కనుపట్టువ్రాల చొక్కపు మెఱుంగు
ఊడినోనినుడువులై కడివోని తలఁపులై పోడిమి మించు కూర్పుల తెఱంగు
చదువుల కుదురులై చదురుల కిరవులై పాటిల్లు తొంటికబ్బపుహొఱంగు
పుట్టతేనియపోలిక నిట్టలంపుఁ, దీయఁదనమున బాసలదీటు గనక
నాఁటుపలుకులలోపల నాడెమైన, తెనుఁగుబాసయ మాకెల్ల తెలివు నించు.

### తెనుఁగు కైత

సీ. చదివినకొలఁదియుం జవులూఱఁజేసెడు పలుకుచే బెట్టువీనులకు విందు
నాఁటినకొలఁదియు న్మాటలకూరుపు నొడలగుర్పాటు నొదవఁజేయు
తెలిసినకొలఁదియు తెలివి వెల్గును నించి మఱువు జీకటిమాయఁ జేయు

తటుచినకోలఁదియుఁ దలఁపుతీపుల నించి హాయి దా నెదకు, బెంపారఁజేయుం
వెన్నెలం దేల్చినట్టుల, విన్ను వాఁక, నీటవ్రాల్చినయట్లు. పన్నీరుజల్లి
కప్పురము గప్పినట్టుల, గడనమీఱు, తీరుకల్గిన దొకటి మా తెలుఁగు కైత.

ఈ గ్రంథము పేరు మించుపల్లె,
దీనినిఁ జదువగా

Sweet Obern! loveliest village of the plain,
Where health & plenty cheered the labouring swain.

అను గోల్డుస్మిత్తు (Oliver Goldsmith) గ్రామవర్ణన ఆంగ్లవిద్యాధికులకు జ్ఞప్తికిరావచ్చును. ప్రాచీన సంప్రదాయ విశేషజ్ఞుల కిది వసిష్ఠాశ్రమము వంటి ఋషివాటిక యెదఁదట్టును.

మేరీకార్లె, ఇట్టి నిష్కలుష గ్రామముకొఱకే యొక మల్టీమిలియనేరును ప్రపంచమంతయుం ద్రిప్పినది.

మించుపల్లెలోని కథ యిది.

ఆ. అనఁగ ననఁగ నొక్క యగ్రహారంబులో, బాపఁడొకఁడు లేమి బాపుకొఱకు
నేన్గునాశ్రయించి యేనుఁగెక్కినంత, సిరినిఁ బొందె దానిఁ జెప్పువాఁడ.

ఈకథ రమణీయముగా ద్రాక్షపాకమున ప్రసాదగుణ ప్రధానముగా వర్ణింపఁబడినది.

ఆ కథాంత మిట్లు.

గీ. ఏనుఁగును నాశ్రయించి దా నంతసిరిని,బొందె గావున గజపతిభూమివిభుఁడు
ఏనుఁగెక్కించి కటక మూరేఁగఁజేసి, సాగనంపెను తన్నిజస్థానమునకు.
పాలుపొంగినయట్లు బాపనియింట, శ్రీలుపొంగెను యశశ్శ్రీనిండుకొనియె
సరిదీని విని, చెప్ప, చదివిన వ్రాయ, కరుణించు శివుఁడు మంగళమహాశ్రీలుం.

ఈగ్రంథకర్త ఆంధ్రదేశమున బహుళాంధ్ర గ్రంథ సంపుటములను సేకరించి, ఆంధ్రభాషాయోషను పోషించిన సరస్వతీ భవనముంఁ బుట్టి, భాషా

సేవా పరతంత్రుఁడై, ఆంగ్ల సారస్వతమున నాఱితేరిన సుప్రసిద్ధ యువకుఁడు. శ్రీ నిడదవోలు వేంకటరావు. ఎం. ఏ. మద్రాసు విశ్వవిద్యాలయమున నాంధ్రోపాధ్యాయుఁడు. (మంజువాణి.)



## మించుపల్లె—తెలుఁగుపొలుపు.

### గ్రంథకర్త:— శ్రీ నిడుదవోలు వేంకటరావు యమ్. ఏ.

ఆంధ్రోపన్యాసకుఁడు—మద్రాసు విశ్వవిద్యాలయం.

కృష్ణాపత్రిక సం॥ 46 సంచిక 18, 26-4-1947.

గ్రంథకర్త భాషాపరిశోధనమున వన్నెకెక్కినవారు. ముఖ్యముగా శివకవులరచనలు వీరి కభిమానస్థానము. తెలుగు నుడికారము వీరికి వశంవదమైనది. ఈగ్రంథమందలి తెలుఁగుపొలుపు - తెలుగునుడులపొలపమును బుడికిపుచ్చుకొన్న అచ్చతెనుగు కబ్బము. ఇందు తెలుగుతల్లి, తెలుగుకైసరి తెలుగు కబ్బము, తెలుగుబాస పొగడువడసెను. ఒడలెల్ల కన్నులుగా, చేతల్లుగా, ఎడందగా వీరికి తెలుగుతల్లి దర్శనమిచ్చింది. పలుకులఁజెప్పి, చేతలనుబట్టి, తలంపుల నిల్వరింపగా కొలఁదికి మీరునట్టి వెలుగుం బొడలెల్ల తెలుగుమాటలతో కొలదికి తెచ్చినట్టి తెలుగుకైసరుల అన్నువచేవను వీరిందు తలంపునకు తెచ్చిరి. 'చవిలేనిబ్రదిమి పండ్లను చవులూరెడునట్లుజేసి జగమంగడిలోతవిన వెలజాడగనగా కవిచేసెడి' తెలుగుకైసరుల కబ్బములలో పల్కు జవరాలిమెఱుంగు తుఱంగలించునొడ్డాణపుపైడిమువ్వలమవ్వపుసవ్వడులు వీరిని పల్కరించును. తెలుగుదనముపై వీరికి గడిలేనిపెరిమ.

మించుపల్లె యను రెండవకావ్యము గజపతి సోమశర్మయను బాపని కగ్రహార మిచ్చినకథ. కథనమున నేర్పొకింతకొఱవడినను పల్లెలప్రశాంత జీవన మిందు కన్నులగట్టును. నేటినాగరకజీవనమునకు పట్టుపైన ముఖ్యమగు

తొల్లిటిపల్లెల అకృత్రిమ రామణీయకముపట్ల అక్షయము ఈకబ్బమున అడు గడుగున చివురించుచుండును.

మెఱుగులీనంగ దోమినరాగిబిందియ భుజపేరులలితకుబూవుగాగ కైవంపునున్న సిర్కావిమడుంగులు చేదమ్మికొక వింత చెలువమెసగ - పంచ యజ్ఞములకు జలముదెచ్చు తలిరుబ్రాయంపు సోమిదమ్మలచాయ పసుపు బూతలూ, కొయ్యకాటుకనలుపులూ నిందు సాక్షాత్కరించును. పేయపై కవ్వమున వెన్నదీయ తీయతీయనైన మజ్జిగ తేటయేగాని ఆయూరివాడు "ఉడుకునీరములూ రంగునీళ్లూద్రావరు మడిప్రత్తిమిడిచి కదురునవడికిన రాటంపునూలు పదనిడి యలత్రొక్కుడుపలక నేతబట్టలగట్టుకొను అజాన పదులు, కంగుకంగనుబరువు రొక్కమునేగాని మద్దరబొమ్మలు, బొమ్మచీట్లూ ఒల్లరట! అప్పుసేతలు సేయమి గొప్పకొలుకు తప్పుదారులుత్రొక్కమి ముప్పుతరిని త్రిప్పటలు లేనిమనుగడనొప్పు, అపల్లెజనులకుప్పుతో గూడ తొమ్మిదియునుండి సంతుష్టికూర్చును. తుష్టిని దోషముగా నెంచు నేటియంత్రనాగరికులు వేంకట రావుగారి మించుపల్లెలో ఒక్కగడియైననుండనొల్లరచుట నిక్కము. 'ధనుశర ములు' వంటి ఒకటిరెండుదోషములూ కరవీరనాగలింగపుష్పలతతులకిరవై అనుచో గణభంగమువంటిప్రమాదములున్ననూ గ్రంథమంతయు ప్రతిపద్య మనోహరమైయున్న దనవచ్చును. మరియు గొన్నిపద్యములు సూత్రప్రాయ ములై సుమతిశతకమును వేమనపద్యాలను మఱపించుచున్నవి.

తెలుగునుడుల బెడగునడతల యొడికమువడి వడితనంబు నుడివోవని కూర్పు యీగ్రంథమునందువలె మరొక్కచో గనరావన్న అతిశయోక్తికాదు.

శ్రీవత్స.

చెన్నపురి: 'వాహిణి' ప్రెస్సున ముద్రితము —1950

| | | |
|---|---|---|
| 1. మించుపల్లి | ... | 1—8—0 |
| 2. తెలుఁగు వెలుఁగు వ్యాఖ్య | ... | 0—8—0 |
| 3. త్రిపురాంతకోదాహరణము | ... | 1—8—0 |
| 4. భాషాపరిశోధనప్రయోగవిశేషములు | ... | 1—0—0 |
| 5. ఉదాహరణవాఙ్మయచరిత్రము | | (అచ్చగుచున్నది) |

వలయువారు:—


యన్. సుందరేశ్వరరావు,

9, ఆఫీసు వెంకటాచల మొదలివీథి,

ట్రిప్లికేను, మదరాసు.